# ఆంధ్రపత్రిక


The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 35 No. 229 MONDAY 22nd NOVEMBER 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao


# బ్రిటన్ భారతదేశ భవిష్యత్సంబంధాలగురించి ఢిల్లీలో ప్రధానమైన చర్చలు

## "సహాయం చేయకపోతే కమ్యూనిస్టులకు దాసోహ మనకతప్పదు"

### అమెరికాకు చాంగ్‌కైషేక్ విజ్ఞప్తి

### ఈ పరిస్థితుల్లో ఎంత చేసినా ఏమీ ప్రయోజనం ఉండదని విదేశాంగ కార్యదర్శి మార్షల్ అభిప్రాయం

వాషింగ్టన్, నవంబరు 20: తత్‌క్షణం సైనికసామగ్రిని దానితో పాటు, ద్రవ్య చలామణి స్థిరీకరణకు మరికొంత ఋణమును యిచ్చి, అమెరికా పూర్తిగా సహాయపడకపోయినట్లయితే, చైనా కమ్యూనిస్టులకు పాదాక్రాంతం కాకతప్పదని, చైనా రిపబ్లిక్ అధ్యక్షుడు జనరలిజిమో చాంగ్‌కైషేక్, అమెరికా సెనెట్ అప్రాప్రియేషన్ కమిటీ తరఫున తన కడకువచ్చిన ప్రత్యేక రాయబారవర్గమునకు స్పష్టకరించినట్లు నేడిక్కడ తెలియవచ్చెను. ఈ విషయం సెనెట్ అప్రాప్రియేషన్ కమిటీ రాయబారవర్గనివేదికలో ఉదహరింపబడెను.

"అప్పుడప్పుడు స్వల్పమాత్ర సహాయం చేసినంతమాత్రమున కమ్యూనిజానికి బలి కాకుండా చైనాను రక్షించుట దుర్లభం. చేయదలచుకొన్న సంపూర్ణ సహాయంచేయుటో, లేక యే సహాయం చేయకుండా మానుటో;" సెనెట్ అప్రాప్రియేషన్ తరఫున, సెనెటర్ క్లార్క్ (డెమోక్రాట్) నాయకత్వాన చైనా వెళ్లిన యీ రాయబారవర్గం చాంగ్‌కైషేక్‌ను సందర్శించగా ఆయన యీవిధముగా అనినట్లు, రాయబారవర్గనివేదికలో ఉదహరించబడెను.

"లోగడ అమెరికా ప్రభుత్వం మంజూరుచేసిన సైనికవస్తు సామగ్రిసహాయం, తత్‌క్షణం చైనాకు అందచేయవలెను. (ఈ సంవత్సరారంభంలో చైనాకుగాను కాంగ్రెస్ ఆమోదించిన 12 కోట్ల 50 లక్షల డాలర్ల సైనిక సహాయమేయిది) ...

... చైనాకు అందచేయవలెను. ఇలా చేసినట్లయిన, చైనా బడ్జెట్‌లో యుద్ధ వ్యయం చాలావరకు తగ్గగలదు. మోటారు రవాణా సదుపాయములు ...

[2 పేజీ చూడుడు]

### చైనా అంతర్యుద్ధం:

## సుచౌ రంగంలో ప్రభుత్వ సేనలకు మరికొన్ని విజయాలు

## మహాసాయుధాపై కాంగ్రెస్ నాయకుల అభిప్రాయాలు: అట్లీకి నెహ్రూ నివేదన

## కామన్వెల్తులో ఉండవలసిన అవసరం లేదని శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 20 భారతప్రధాని పండిత నెహ్రూ లండన్ నుండి తిరిగివచ్చినప్పటినుంచీ, కామన్వెల్తుతో ఇండియాకు ఉండవలసిన సంబంధములను గురించి కాంగ్రెసుపార్టీ సమావేశాలలోనూ, కార్యవర్గసమావేశాలలోనూ, ప్రభుత్వంలోని తన సహచరులతోనూ సంప్రదింపులు జరుపుతున్నాడు. ఈ సంప్రదింపుల ఫలితాలను ఆయన ఎప్పటికప్పుడు బ్రిటిషుప్రధాని అట్లీకి తెలియజేస్తున్నాడనీ, అట్లీ వీటిపై ఇతర అధినివేశనాయకులతో సంప్రదిస్తున్నాడనీ తెలుస్తున్నది. ఇండియన్ రిపబ్లిక్ కామన్వెల్తులో ఉండటానికి ...

... అంతర్జాతీయ చిక్కులు రావచ్చును కనుక దానికి ఇండియాలో ఎక్కువమంది సుముఖంగా లేరనీ, ద్వి దేశ పౌరసత్వ పద్ధతివలన బ్రిటిష్ వలసలలోనూ, అధినివేశాలలోనూ ఉన్న భారతీయులలో సంబంధాలు ఏర్పడవచ్చును కనుక రెండవ దానికే ఎక్కువ సుముఖంగా ఉన్నారనీ తెలుస్తున్నది.

ఇండియన్ రిపబ్లిక్ అధ్యక్షుడు, ఇండియాలోని కామన్వెల్తు దేశాల పౌరులకు సంబంధించినంతవరకూ 'రాజప్రతినిధి' గా భావించబడునన్న సూచన ఒకటి చేయబడినది. అయితే ఈ అంశం భారతరాజ్యాంగంలో పేర్కొనబడదనీ, రాజ ప్రకటన మాత్రమే చాలుననీ తెలుస్తున్నది.

### శ్రీమతి విజయలక్ష్మి పండిట్ అభిప్రాయం

ప్యారిస్, నవంబరు 20: ప్యారిసులో అయిక్యరాజ్య సమితి సమావేశమునకు భారత ప్రతినిధివర్గ నాయకురాలుగా హాజరైన శ్రీమతి విజయలక్ష్మి పండిట్ యిట్లు ...

### బర్లిను ప్రతిష్టంభన

#### ఈ సంవత్సరం పరిష్కారం కాదు

విజయలక్ష్మి పండిట్ అభిప్రాయం

### "అల్పసమితి" వ్యవధి

#### ఏడాదిపరకూ పొడిగింపు

#### రష్యా కూటమి ప్రాతికూల్యం

... నిరుపయోగ పరచుటకే "అల్పసమితి"ని పొడిగింపవలెననుటకు కారణమని తూర్పురాజ్యములు ప్రతికూలవాదన చేసినవి.

## సైనికసామగ్రి రవాణా చేయుటలో పాకిస్థాన్ కాలవిలంబన విధానం

### విచారణకు త్వరలో అంతరధినివేశ సమావేశం

న్యూఢిల్లీ, నవంబర్ 20: దేశ విభజన అనంతరం అవి భక్త భారతదేశానికి చెందిన సైనిక సామగ్రిని పంచుకొనుట, మరియితర ఆర్థిక వివాదాంశాలను గురించి చర్చించుటకై ఇండియా, పాకిస్థాన్‌ల ప్రతినిధులు నవంబర్ 22 వ తేదీన ...

700 మాత్రమే వచ్చినవి. 12 వేల టన్నుల ఆయుధసామగ్రి రావలసి ఉంటే 100 టన్నులు మాత్రమే వచ్చినది. పాకిస్థాన్ ప్రభుత్వము, పత్రికలు ఇండియా ఇవ్వవలసిన విషయాన్ని గురించే చెపుతున్నారు ...

## కాశ్మీర్ పరిస్థితిని 'చక్క'చేయడానికి త్వరలో పాకిస్థాన్ సైనిక చర్యలు

### భారతప్రభుత్వంపై దురాక్రమణ నేరాన్ని ఆరోపిస్తూ అధినివేశ ప్రభుత్వోద్యోగి ప్రకటన

లండన్, నవంబరు 20 కాశ్మీర్ ప్రస్తుత పరిస్థితిని చక్కబరచుటకు, కొద్దిరోజులలోనే పాకిస్థాన్, తగిన సైనిక చర్యలను గైకొనవలసివచ్చునని, కరాచీలో పాకిస్థాన్ ప్రభుత్వోద్యోగి ఒకడు వెల్లడించినట్లు, కడచినరాత్రి బి. బి. సి. రేడియో ప్రకటించెను.

జమ్మూ ప్రాంతంలోనూ, నైరుతి కాశ్మీరులోనూ, క్రొత్తగా దండయాత్రను ప్రారంభించుటద్వారా, ఎదురాక్రమణ చర్యను జరుపమని లోగడ పాకిస్థాన్‌కిచ్చిన వాగ్దానమును భారతప్రభుత్వం భగ్నమొనర్చినది. కాశ్మీర్ కమీషన్ నివేదికను భద్ర...

శ్రీనగర్, నవంబర్ 21: భారత ప్రధాని పండిట్ నెహ్రూ, ఈరోజు శ్రీనగర్ కువచ్చెను. కాశ్మీర్ 5 వారముల క్రితం భారత యూనియన్‌లో చేరిన తర్వాత ...

(2-వ పేజీ చూడుడు)

### పాకిస్థాన్ రక్షణ ప్రాధాన్యము

#### ఢక్కాలో లియాకతలీ ప్రసంగము

... మన స్వాతంత్ర్యమున కేవిధమైన ముప్పు వాటిల్లినను ఈ దేశములోని ముస్లిములకేగాక, సమస్త ప్రపంచమునకు పెద్ద విఘాతము కాగలదు. ప్రపంచములోని ఏ దేశము మనపై దురాశలను పెట్టుకొన వీలులేనంతటి బలిష్టముగ పాకిస్థానును మనము చేయవలెను."

### పాకిస్థాన్ ప్రజలకు గవర్నర్‌జనరల్ విజ్ఞప్తి

పెషావర్, నవంబరు 20: పాకిస్థాన్ సైన్యంలో, విశేషంగా చేరవలసినదిగా, సరిహద్దురాష్ట్ర ప్రజలకు, పాకిస్థాన్ గవ...

[2 పేజీ చూడుడు]

## ఇండోనేసియా ప్రతిష్టంభనా పరిష్కారానికి డచ్ ప్రభుత్వప్రయత్నం

### బటేవియాకు మంత్రివర్గరాయబారంపంపుటకు నిర్ణయం: డచ్ అధికారులకు కొత్తసూచనలు

హేగ్, నవంబర్ 20: మూడేళ్ళ నుండి ఇండోనేసియా రిపబ్లిక్‌లో జరుగుతున్న తగాదాపై ఒక స్పష్టమైన పరిష్కారమార్గమును సాధించుటకై డచ్చి ప్రభుత్వం మంత్రివర్గప్రతినిధుల్ల సంఘాన్నొకదాన్ని త్వరలో పంపుతున్నదని అధికారరీత్యా ప్రకటించబడినది. ఇందులో విదేశాంగమంత్రి స్టికర్, వలసరాజ్యాల మంత్రి జాసెన్, ఇండోనీసియాలో డచ్చి ప్రతినిధి సెహేర్‌లు సభ్యులు. విదేశాంగ మంత్రి డా॥ స్టికర్ ఈమధ్య రిపబ్లిక్ ...

నెలకొల్పేటకు బటేవియాలో జరిగిన జావానాయకుల సమావేశమొకటి నిర్ణయించినదని డచ్చివార్తాసంస్థ అనెటా ప్రకటించినది. ఈ ప్రాంతం చెరుకు, బియ్యం, మొదలయిన విలువగల పంటలు

(2-వ పేజీ చూడుడు)

### తూర్పు జావాకు ప్రత్యేక రాజ్యం?

## భారత నౌకా పరిశ్రమ

### సింధియాకృషి ప్రశంస

### సర్దార్ పటేల్ ఉపన్యాసం

న్యూఢిల్లీ, నవంబర్ 20: "ఎటువంటి బలవత్తర సంస్థ కయినా గుండెలను నీరు చేసే ప్రతికూల పరిస్థితులలో సింధియా కంపెనీ నౌకానిర్మాణ పరిశ్రమను నెలకొల్పి దేశానికి చేసిన సేవ ఎంతయినా ప్రశంసించతగినది. ప్రపంచదేశాలన్నిటితోపాటు మనదేశానికి కూడా నౌకాయానంలో స్థానం సంపాదించుటకు జరిగిన ప్రయత్నాలను విదేశ కంపెనీలవారు, ఈ దేశంలో పీఠం వేసుకునివున్న విదేశ ప్రభుత్వ సహాయంతో భగ్నపరుచుటకై తీవ్రకృషి చేసి ఎంతోకాలము కాలేదు. ఆ విదేశకంపెనీల లాభాలను కాపాడుటకై ఇండియా ప్రభుత్వ చట్టములలో చాల పక్షపాతబుద్ధితో అనేక రక్షణలు ఇవ్వబడినవి. కొన్ని సం॥ల కిందట, మనదేశంలో, మన నౌకానిర్మాణ శాలలలో ఆధునిక నౌకలు నిర్మింపబడవలెనని చెపితే అనాలోచితంగా తీవరపడి చెప్పినమాటగా భావించబడేది. కాని ఈనాడు సింధియాకంపెనీవారి కృషి వలన విశాఖపట్నంలోనే రెండవ నౌక నిర్మించబడగా చూసే అదృష్టం మనకు లభించినది" అని భారత సహాయ ప్రధాని సర్దార్ పటేల్ నేడు సింధియాకంపెనీవారి 'జలప్రభ' జలప్రవేశోత్సవ సందర్భంలో ఢిల్లీనుండి చేసినప్రసంగంలో ప్రశంసించెను.

ప్రస్తుతం దేశ ఆర్థికాభ్యుదయానికి వాణిజ్యనౌకల నిర్మాణం ఎంత అవసరమో ఆయన వివరించి, విమానబల నిర్మాణానికి పౌరవిమానయానం ఎంత మూలాధారంగా ఉంటుందో ఆదేవిధంగా, నౌకాబల నిర్మాణానికి వాణిజ్యనౌకలు వెన్నెముకవలె ఉంటునని ఆయన హెచ్చరించెను. (సర్దార్ పటేల్ ప్రసంగపువివరాలు కొన్ని నిన్న సంగ్రహంగా ప్రకటించబడినవి.)

సర్దార్ పటేలు, సింధియాకంపెనీప్రముఖులను వాల్చంద్ హీరాచంద్, ఎం. ఎ. మాస్టర్ మొదలైనవారితో సరిగా ఉదయం 9 గంటలకు ఇర్విన్ స్టేడియంవకు వచ్చెను. అనంతరం కార్డినిమిషాలకు గవర్నర్ జనరల్ రాజాజీకూడా విచ్చేసెను. 'జలప్రభ' ప్రారంభోత్సవం జరపవలసినదని సర్దార్ పటేల్ను కోరుతూ వాల్చంద్ హీరాచంద్ ప్రసంగించిన నిదట. జలప్రవేశ సమయసూచక మయిన మాటను నొక్కి సర్దార్ పటేల్ ఈ క్రిందివిధంగా ప్రసంగించెను.

"భారత నౌకా నిర్మాణ పరిశ్రమ యొక్క మంచిచెడ్డలు ఇంతవరకు సింధియా కంపెనీవారి అదృష్ట దురదృష్టాలతో కలిసి ఉన్నవి. నౌకానిర్మాణాన్ని కంట్రోలు చేయుటకై, 'జల ఉష' ప్రారంభోత్సవములో ప్రధాని నెహ్రూగారు కోరినట్లుగా, స్థాపింపబడుతున్న నౌకా నిర్మాణ సంస్థకు సింధియాకంపెనీవారే మేనేజింగ్ ఏజంట్లుగా ఉండవలెనని భారతప్రభుత్వం నిర్ణయించుటచే, ఈ కంపెనీ ఇనుకటివలెనే భారతీయ నౌకానిర్మాణంలో ప్రధాన పాత్రను నిర్వహించగలదు.

### సింధియా కంపెనీ కృషి

ఎటువంటి బలవత్తరసంస్థ కయినా గుండెలను నీరుచేసే ప్రతికూల పరిస్థితులలో సింధియా కంపెనీ నౌకానిర్మాణ పరిశ్రమను నెలకొల్పి దేశానికి చేసినసేవ ఎంతయినా ప్రశంసించ తగినది. ప్రపంచ దేశాలన్నిటితోపాటు మన దేశానికి కూడా నౌకాయానంలో స్థానం సంపాదించుటకై దేశంలో జరిగిన ప్రయత్నాలను విదేశకంపెనీలవారు, ఈ దేశంలో పీఠం వేసుకునివున్న విదేశప్రభుత్వపు సహాయంతో భగ్నపరుచుటకై తీవ్రకృషి చేసి ఎంతోకాలం కాలేదు. ఆ విదేశ కంపెనీల లాభాలను కాపాడుటకై ఇండియా ప్రభుత్వచట్టములలో అనేకరక్షణలు కేవల పక్షపాతబుద్ధితో ఇవ్వబడినవి. మన దేశంలో ఆధునిక నౌకలు నిర్మించవచ్చునని కొన్ని సం॥ల కిందట చెప్పితే, అది అనాలోచితంగానూ తొందరపాటుతోనూ చెప్పినవిషయమని భావించబడేది. ఈ విషయమై 10 సం॥ లకిందట నేను చెప్పిన విషయాన్ని వాల్చంద్ హీరాచంద్ గారు ఉదహరించినందుకు సంతోషిస్తున్నాను. అప్పుడు నేను అన్నది ఈనాటికి నిజమైనదని నేను సంతోషిస్తున్నాను.

### నౌకా నిర్మాణావశ్యకత

మన నౌకా నిర్మాణపరిశ్రమ ఇంకా శైశవంలోనే వున్నది. భూగోళంలో భారతదేశపు ఉనికిపట్టునుపట్టి భారతదేశానికి తన అవసరాలకు తగినన్ని నౌకలు, తన దీర్ఘ సముద్ర తీరాన్ని రక్షించుకొనుటకు బలిష్ఠ నౌకాదళము ఉండటం అవసరం. మన అవసర దినుసులకు తెప్పించుకొనుటకై విదేశ నౌకల కంపెనీలకు కోట్లకొలది రూపాయలను చెల్లిస్తున్నాము. మన అవసరాలకు

## "దక్షిణాఫ్రికా జాతీయ వాదుల చరిత్రను ప్రపంచంమరచిపోదు"

### ఎరిక్ లోకు "బహిరంగలేఖ"

పారిస్, నవంబర్ 20: దక్షిణ ఆఫ్రికా భారతీయ కాంగ్రెసు ప్రతినిధి అయిన కాశీమ్ జద్వత్ "ఎరిక్ లౌకు బహిరంగ లేఖ" అను పేరిట కొన్ని కరపత్రములను నేడిక్కడ ఐక్యరాజ్యసమితి ప్రతినిధులకూ పత్రికా విలేఖరులకూ పంచిపెట్టెను. ఆ కరపత్రములో కాశీం జద్వత్ దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం అవలంబించుచున్న జాతి విద్వేష విధానాన్ని ఈవిధంగా విమర్శించెను:-

"ఈ విశాల ప్రపంచానికి ప్రాతినిధ్యం వహించే ఈ ఐక్యరాజ్యసమితిలో నా అనేవాడు ఒక్కడైనా లేకుండా ఏకాకిగా తార్లాడుతున్న మిమ్మల్ని చూస్తే నాకు సంజాలి కలుగకొని పోతున్నది. మీ అభినయాలనూ మీ మాయ మాటలనూ సమితిలోని మిగతా 50 దేశాల ప్రతినిధులు ఎందుకు నమ్మటంలేదు, అని మీకు నుర్రుగాఉన్నది. ఐక్యరాజ్య సమితివంటి సంస్థలో తెల్లవారి సరసన నల్లవారు కూర్చొని సమాన స్థాయిలో మాట్లాడడం ఎరిక్ లౌకు దుస్సహంగా ఉన్నది. బహుశా తెల్లవారికీ నల్లవారికీ విడి విడిగా సమితులు ఏర్పాటుచేయవలెనని ఆయన ఊహించవచ్చును. దక్షిణ ఆఫ్రికా భారతీయుల సమస్య ప్రాక్పశ్చిమాల సంఘర్షణ అనీ, కమ్యూనిస్టుల ఆందోళన అనీ, నినాదాలు లేవదీసి ప్రతికూలపక్షాన్ని పాడలగొడదామని మీరు ప్రయత్నిస్తున్నారు. ఈ రహస్యమంతా ఎక్కడ బైటపడుతుందో అని దాదూ, నాయకర్, మైకేల్ స్కాట్ ప్రభృతుల పాస్ పోర్టులను మీరు జప్తుచేసుకొన్నారు. మానవ హక్కుల గురించీ, ప్రతి వ్యక్తికి స్వతఃసిద్ధంగా ఇవ్వవలసిన గౌరవ మర్యాదల గురించీ, మీరు గొప్పగా చెప్పే మాటలన్నీ, కల్లబొల్లి కబుర్లని ప్రపంచానికి తెలుసును.

జెకోస్లావాకియా, పోలెండు, నార్వే, ఫ్రాన్సు మొదలైన దేశాలలో స్వాతంత్ర్య జ్యోతులు ఆరిపోయి జగత్తంతా దుఃఖమగ్నమైయున్న సమయంలో ద. ఆఫ్రికా నేషనలిస్టులు ఆనంద పరవశులై వికటంగా అట్టహాసాలు చేశారు. నేషనలిస్టుల చరిత్రను ప్రపంచం మరిచిపోలేదు."

ఎంతో అవసరమై, ఎంతో దుర్లభంగా ఉంటున్న విదేశద్రవ్యంలో అధికభాగం ఈ విధంగా ఖర్చు పడిపోతున్నది. ఎంతో అరుదైన ఈ తరుణంలో విదేశ నౌకలమీద ఆధారపడినందువల్ల మనదేశం చాలా దెబ్బ తింటున్నది. అత్యవసర పరిస్థితులలోకూడ మనం విదేశకంపెనీల దయాధర్మాలమీద ఆధారపడవలసి వస్తున్నది. పెట్రోలుకంపెనీలు తగినన్ని నూనె పడవలను పంపలేనందువలన మన పెట్రోలు సప్లయి చాల తగ్గిపోయిన అంకాన్ని ఉదాహరణకు తీసుకోవచ్చును.

విదేశప్రభుత్వ హయాములో మనకు కలిగిన నిరోధాలవలన ప్రపంచ ఆర్థిక వ్యవస్థలన్నీ తారుమారై పోయిన ఈ పరిస్థితులలో, ఇండియా ఆర్థిక స్థిరత్వమును సంపాదించుకొనుట కష్టతరమై పోతున్నది.

### ప్రభుత్వ తోడ్పాటు

విమానబల నిర్మాణానికి పౌరవిమానయానం ఏ విధంగా మూలాధారమో, అదే విధంగా నౌకాబల నిర్మాణానికి వాణిజ్య నౌకలు వెన్నుపూసవంటివి. ఇందువల్లనే ఈ పరిశ్రమకు అత్యంత ప్రాధాన్యత ఉన్నదని ప్రభుత్వం గ్రహించి,కిందటిఏప్రిల్ లో తాము ప్రకటించిన విధానంలో తమ పూర్తి తోడ్పాటు నౌకాపరిశ్రమకు ఉండగలదని తెలియజేసి ఉన్నది. ఇంజన్లు, బాయిలర్లు మొదలైన యంత్రాలను నిర్మించటానికి, ఆధునిక పద్ధతులలో ఒకేసారి ఏ డెనిమిది నౌకలను నిర్మించటానికీ వీలుగా తమ నౌకా నిర్మాణశాలను పెంచవలెనని సింధియాకంపెనీ చేస్తున్న ప్రయత్నాలను ప్రభుత్వం గమనించే ఉన్నది. ఈ విధంగా పెంచుటలోగల ఆర్థికమైన, ఇతర ఇబ్బందులను కూడా ప్రభుత్వం గుర్తించి, గడచిన ఏప్రిల్ లో తమ ప్రకటనలో నౌకా నిర్మాణ పరిశ్రమకు పూర్తి తోడ్పాటును ఇచ్చెదమని ప్రకటించినది. ప్రభుత్వం ఉండగా భారత నౌకా పరిశ్రమ భయపడవలసిన అగత్యంలేదు."

తనకు స్వాగతపత్రాలు సమర్పించిన కార్మిక సంఘాలకు సమాధానమిస్తూ, కాంగ్రెసు ప్రభుత్వాలకన్నా కార్మికుల మేలుకోరేవారెవరూ లేరనీ, అహమదాబాద్ మిల్లు కార్మికులకు గాంధీజీ ఇచ్చిన సందేశాన్నే వీరు అనుసరించవలెననీ పరిశ్రమలను వృద్ధిచేయటం వీరి విధి అనీ, స్వలాభపరుల మాటలకు మోసపోవద్దనీ, సర్దార్ పటేల్ హెచ్చరించెను.

## హైదరాబాదు సంస్థాన కాంగ్రెస్ సభ్యులపై శిక్షణ చర్య

### తొలగింపబడిన సభ్యుల అసమ్మతి

[ఆంధ్రపత్రిక విలేఖరి]

హైదరాబాద్, నవంబరు 20: హైదరాబాదు సంస్థాన కాంగ్రెస్ నుండి తొలగింపబడిన సభ్యులు సంస్థానకాంగ్రెస్ చర్యకు అసమ్మతి దెలుపుటకుగాను ఒక ఉపసంఘమును ఏర్పరచియుండిరి. ఈ ఉపసంఘసభ్యులు నేడు శ్రీ రామచంద్రరావుగారి అధ్యక్షతను సమావేశమైరి. పోరాటము సలుపుచుండిన సమయమునందలి భావములనే పోరాట సమాప్తానంతరము గూడ సంస్థాన కాంగ్రెసువారు కలిగియుండుట సరియైన పద్ధతి కాదను అభిప్రాయమును సభవారు వెలిబుచ్చిరి.

తీర్మానములో యింకను యిట్లుకలదు. "పోరాటములో పాల్గొనుటవల్ల కలుగుఫలితములను సంస్థానకాంగ్రెసు వర్కింగు కమిటీవారు పోరాటం ప్రారంభము కాకపూర్వమే అఖిలహైదరాబాదు కాంగ్రెస్ ప్రతినిధులకును, సభ్యులకును బాగుగా తెలియజెప్పవలసి యుండెను. తాము తొలగింపగోరిన సభ్యులను తొలగించుటకుగాను వర్కింగ్ కమిటీవారు శిక్షణచర్యనైకొని రను అనుమానము యిప్పుడు వర్కింగ్ కమిటీనై కొన్న నిర్ణయవల్ల కలుగుచున్నది. అక్రమమగు ఈచర్య సంస్థాన కాంగ్రెసు ఐక్యమునకును, ప్రతిష్ఠకును భంగముకలిగించుచున్నది. ఆంగనిర్మాణమునకు సంబంధించిన తీర్మానమును వర్కింగ్ కమిటీవారు ఉపసంహరించుకొనుట యుక్తము. పోరాటము సంస్థాన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ వారి నిర్ణయముల ననుసరించి సాగింపబడలేదు. పోరాటమును సరియైన పద్ధతులలో సాగించుటకు వాతావరణము గూడ కల్పింపబడి యుండలేదు. వర్కింగ్ కమిటీ, కార్యాచరణ సంఘముల ప్రముఖ సభ్యులు సంస్థానములో సత్యాగ్రహము చేయకుండా సంస్థానమును వదలిపెట్టి వెళ్లుటచేత సత్యాగ్రహోద్యమము జయప్రదము కాలేదు. సత్యాగ్రహము సాగించువిషయమై సంస్థాన కాంగ్రెస్ ప్రతినిధులకు గాని, సభ్యులకు గాని ఉత్తేర్వు లేవియు గావింపబడియుండలేదు. సరిహద్దునందలి శిబిరముల కార్యకలాపములు సక్రమమైనవా, హైదరాబాద్ కాంగ్రెసు ఆదివరకే నిర్ణయించుకొని యుండిన విధానమునకు అనుగుణమా అను విషయము యిక ముందు నిర్ణయింప బడవలసియున్నది. తమకు వప్పజెప్పబడిన పనిని నిర్వర్తింప అ. హైదరాబాదు సంస్థాన కాంగ్రెస్ సభ్యులు, ప్రతినిధులు యెవ్వరు నిరాకరించి యుండలేదు. సంస్థాన కాంగ్రెస్ వారు నిర్వచించిన సిద్ధాంతములను, అనగా సత్యమును అహింసను సభ్యులలోను, ప్రతినిధులలోను విశేషభాగము అనుసరించి బహిష్కరణోద్యమములోను, సహాయ నిరాకరణోద్యమములోను పాల్గొని సంస్థాన కాంగ్రెసును బలపరిచిరనుట కెట్టి సందియమును లేదు. శిక్షణచర్య, ఎన్నికల మూలమున యేర్పడిన సంఘములను రద్దు చేయుట అక్రమము; ప్రజా సత్తాక పద్ధతి విరుద్ధము ఈ చర్య సామాన్యముగా హైదరాబాదు సంస్థానమునందంతట, ముఖ్యముగా కాంగ్రెస్ వర్గములలో చీలిక లేర్పడుటకు కారణభూతమైనది. కనుక వర్కింగ్ కమిటీవారు తమ తీర్మానమును ఉపసంహరించుకొని త్వరితగా ఎన్నికలు జరుగువరకు కాంగ్రెస్ వారల ఐక్యమును చెక్కు చెదరకుండా నుంచవలెనని ప్రార్థించనైనది."

### వనపర్తి విద్యార్థుల ఆదర్శ ప్రవర్తన

హైదరాబాదు, నవంబరు 20: వనపర్తిలో ముస్లిములకు తిరిగి విశ్వాసము నెలకొల్పుటలో ఆ పట్టణ విద్యార్థులు దేశమంతటికి ఆదర్శప్రాయులైరని హైదరాబాదు విద్యార్థి సమితివారు ఒక ప్రకటనలో తెలుపుచున్నారు.

ప్రకటనలో ఈ క్రింది విషయములు కలవు:-రజాకారు ఉద్యమములో పాల్గొనెనను నేరము వనపర్తి విద్యార్థియగు అబ్దుర్ రహమానుపై మోపబడి యుండెను. వనపర్తి విద్యార్థులు అతని విడుదలకై కృషిచేసిరి. అతడు నిర్దోషియని ఋజువు చేసి అతని విడిపించిరి. నూతన సాంఘిక వ్యవస్థలో తమకు స్థానము లేదని తలచుచుండిన వనపర్తి ముస్లిములు అబ్దుర్ రహమాన్ విడుదలయైనందుకు తమ సంతోషమును, కృతజ్ఞతను వెల్లడించిరి. వారికి తిరిగి విశ్వాసభావము కలిగినది. (అ. ప్రె.)

అమ్మాన్, నవంబరు 20: జెరుసలెంలో గతరాత్రి యూదులు 20 నిమిషాలలో 15 మందుగుండ్లను ప్రేల్చినందున అనేక అరబ్ గృహములు ధ్వంసమయినవని, ఇద్దరు అరబ్బులు మరణించిరని అధికారికవార్త ప్రకటింపబడినది.

## అమెరికాకు చాంగ్‌కైషేక్ విజ్ఞప్తి

1 వ పేజి తరువాయి

గతి పట్టుటచే, జంతువులను కట్టి నడిపే బండ్లద్వారా రవాణా సాగవలసిన ప్రమాదం యేర్పడనున్నది.

చైనాప్రభుత్వ సేనాధిపతులలో చాలా పనికిమాలిన అసమర్థులున్నమాట నిజమే. అయితే కొన్ని రాజకీయ కారణములవల్ల వారిని సేనాధిపతి పదవులనుండి తొలగించుట అసాధ్యం. ఉన్నత సైనికోద్యోగులలో లంచగొండితనం ఉన్నది. పై ఉద్యోగుల లంచగొండితనం, యిప్పటికే సైతికంగా పతనమై చైనా శిపాయిలమీద యే విధంగా పనిచేయునో వేరేచెప్ప నవసరం లేదు. చైనా మిలిటరీ ఆచారంప్రకారం, శిపాయిలకు జీతములను బట్వాడాచేయు నిమిత్తం సేనాపతులు పుచ్చుకొన్న డబ్బు నాలావరకు శిపాయిలకు చేరకపోవుట అందరెరిగిన విషయమే."

కనుక, సైనిక వ్యూహాముల విషయంలో చైనాకు సలహాయిచ్చే అధికారమును అమెరికా ఎక్కువగా స్వీకరించవలెను. అవిదగ్గగా చేసినట్లైతేనే చైనా సైనిక పరిస్థితిలోని లోటుపాట్లను తొలగించవచ్చు. అమెరికా సైనికోద్యోగుల సలహా పొంది, చైనాసేనలు పోరాటం సాగించినట్లైతే, అవకతవకలతో కూడుకొని అవివేకవంతమైన యుద్ధవ్యూహాములు లేకుండాపోవును."

సైనికంగా సలహాయిచ్చే అధికారం అమెరికా స్వీకరించే యెడల అందుకు చైనా అంగీకరించుటకు సిద్ధముగనేఉన్నది.

చైనాప్రభుత్వ నాయకులలో ఉన్న అసమర్థతను స్వప్రయోజనమునకు సంపూర్ణంగా వినియోగించుకొనుచూ, చైనా కమ్యూనిస్టులు, చైనా ప్రజలయెడ మైత్రీ విధానమును అవలంబించు చున్నారు. ప్రజా సామాన్యంలో కమ్యూనిజంయెడ ఉన్న భయమును తొలగించుటకు, చైనా ప్రభుత్వసేనలు ఎక్కువగా తమకు లొంగిపోవునట్లు ప్రోత్సహించుట, తద్వారా, చైనా ప్రభుత్వసైనిక సాధన సంపత్తిని మరింత క్షీణింపచేయుటకు, కమ్యూనిస్టులు యీ మైత్రీ విధానమును అవలంబించు చున్నారు.

తమకు లొంగిపోయిన చైనా సైనికులచే ఊడిగం చేయించుటగాని, లేక శిక్షించుటగాని లేకుండా, తుపాకులు ఒప్పగించినంత మాత్రమున, ప్రభుత్వ సైనికులను వదలిపెట్టుచున్నారు. కమ్యూనిస్టు ముట్టడిక్రింద ఉన్న, లేక కమ్యూనిస్టులకు లొంగిపోయిన పట్టణములనుంచి బయటపడుటకు "తుపాకి" ఒక ప్యాస్‌పోర్టులాగా ఉపయోగ పడుచున్నది. కమ్యూనిస్టులు వేసే యీ యెత్తుమూలంగా, ప్రభుత్వసేనలు చాలా కమ్యూనిస్టులకు లొంగిపోవుట, సైనిక సాధన సామగ్రి కమ్యూనిస్టులకు చేజిక్కుట సంభవించుచున్నది.

అమెరికా తీవ్రమైన దురాక్రమణచర్య తీసుకొనక పోయినట్లైతే చైనా, కమ్యూనిస్టుల వశమైనట్లే. చైనా కమ్యూనిస్టుల వశమైనదంటే, మూర ప్రాచ్యముంతా పోయినట్లే, అని అభిజ్ఞులైన చైనావారిలో ప్రతిఒక్కరి నోటినుండి వినవచ్చుచున్నది."

### అమెరికా విదేశాంగ కార్యదర్శి అభిప్రాయము

నాంకింగు, నవంబరు 20: చైనాకు ముఖ్యపట్టణమైన నాంకింగు నగరమందున్న అమెరికను అధికార్లు సమావేశమై చైనాను రక్షించుటకు అమెరికా ఏ విధముగా సహాయము చేయవలెనను విషయమై చర్చించిరి. అమెరికను నౌకాదళశాఖాధికారులును, విమానశాఖాధికారులును చైనాకు యిప్పుడు అమెరికా ప్రభుత్వం సమృద్ధిగా సహాయం చేయవలెనని వాదించిరి. రష్యను కమ్యూనిస్టు వ్యాప్తిని నిరోధించుటకై చాంకైషేకు ప్రభుత్వమునకు అమెరికా చేయూత నొసంగవలెనని వాదించిరి. కాని, పెట్టసైన్యాల శాఖాధికారులును, రాయబారవర్గ అధికారులును భిన్నాభిప్రాయులైరి. అమెరికా విదేశాంగ కార్యదర్శి మార్షలు ఏ అభిప్రాయ ధోరణిని యీ విషయములో సూచించెనో ఆ అభిప్రాయ ధోరణినే వీరుకూడా వెల్లడించిరి. చైనాలోని చాంకైషేకుయొక్క జాతీయపక్ష ప్రభుత్వమును ఏ విధముగా చైననను నిలువబెట్టి రక్షించుటకు వీలులేకుండా కాలము మించిపోయినది. కనుక చైనాలోని చాంకైషేకు ప్రభుత్వమును రక్షించుటకు అమెరికా పూనుకొని ఇప్పుడు సహాయం చేయబూనుకొనుటవల్ల ప్రయోజనం లేదు. కాని, చైనాకు యధాశక్తిగా అమెరికా సహాయం చేయవచ్చును.

### కొత్తన్యాయమూర్తి

న్యూఢిల్లీ, నవంబర్ 20: భారత గవర్నర్ జనరల్ శ్రీ ఎ. వి. విశ్వనాథశాస్త్రిగారిని మద్రాసు హైకోర్టు శాశ్వత న్యాయమూర్తులలో ఒకరుగా నియమించెనని ప్రభుత్వ ప్రకటన తెలుపుచున్నది.

## డచ్ ప్రభుత్వ కొత్త ప్రయత్నం

1 వ పేజి తరువాయి

పండే ప్రాంతం. సూరబాయారేవు ఈ ప్రాంతంలోనే వున్నది.

ఇండోనీసియా రిపబ్లిక్ పై తిరుగుబాటు సాగిస్తున్న కమ్యూనిస్టులు వడక్ దగ్గర జలాశయంకట్టలు తెంపి బోజొనగరాన్ని ముంచివేయుటకు సన్నాహాలు చేస్తున్నారు.రిపబ్లిక్ లోవున్న ఏకైక పెట్రోలు గనిపట్నం జేపుదగ్గర కమ్యూనిస్టులుభూదగ్ధ విధానం అనుసరింప చూస్తున్నారు. అందువలన యుద్ధచర్యలు త్వరలో చేయవలెనని రిపబ్లిక్ ప్రాంతీయసేనాని హెచ్చరించెను.

### డచ్చి అధికారులకు సూచనలు

బటేవియా, నవంబర్ 20: ఇండోనీసియా రిపబ్లిక్ తో తిరిగి సంప్రదింపులను సాగించవలసినదని డచ్చి ప్రభుత్వం స్థానిక డచ్చి అధికారులకు కొన్ని సూచనలను పంపిరని విశ్వసనీయంగా తెలుస్తున్నది. ఈ సంప్రదింపులు ప్రారంభమయ్యేటప్పుడు రావలసినదని సమితి మధ్యవర్తి సంఘాన్ని రిపబ్లిక్ ఆహ్వానించినదని కూడా తెలుస్తున్నది. సంప్రదింపులు జోగ్జకర్తదగ్గర ఉన్న కల్యురాంగ్ వద్దర జరుగును. ఇతర విషయములను చర్చించుటకు ముందు డచ్చి ప్రతినిధులు రిపబ్లికనను యుద్ధవిరమణలోని కొన్ని అంశములను స్పష్టీకరించ వలెననీ, రిపబ్లికన్ సేన యొక్క భావిహోదాను కూడా సూచించ వలెననీ, అడుగవచ్చుననీ, తెలుస్తున్నది. వచ్చే ఫిబ్రవరినాటికి తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వాన్నేర్పరచి, రాజ్యాంగపరిషత్తును సమావేశపరచవలెననీ అమెరికన్ మధ్యవర్తి చేసిన సూచనలుకూడా సంప్రదించబడవచ్చును.

ప్రస్తుతం సుమత్రాలో ఉన్న రిపబ్లిక్ ప్రధాని హట్టా, అవసరమయితే ఈ సంప్రదింపులకు జావా వచ్చుటకు సిద్ధంగా ఉన్నాడు.

### ఢిల్లీలో ప్రధానమైన చర్చలు

(1-వ పేజీ తరువాయి)

చున్నది. అయిర్లాండుయెడల నాకు అభిమానము కలదు.

హైదరాబాదు సమస్య అయిక్యరాజ్యసమితిలో తిరిగి చర్చకు యీ సమావేశములో రాజాలదు. ఆ వ్యవహార వివాదమునకిక చర్చ అనవసరమని స్పష్టి చెప్పినట్లే. పాలస్తీనా వ్యవహారములోను, దక్షిణాఫ్రికా వ్యవహారములోను కొరియా వ్యవహారములోను అయిక్యరాజ్యసమితి ఇంతవరకు సమగ్రంగా ఏవిధమైన పరిష్కారముచేయ లేదు. కారణమేమనగా అయిక్యరాజ్య సమితి తన అధికారమును చలాయింపగల్గుటకు కొంత ఆయుధబలమును సైనిక బలమును కలిగియుండవలెను. ఆ విధముగా తన బలమును ప్రయోగించి తన మాట చలామణీ చేసికొనజాలనియెడల అయిక్యరాజ్యసమితి అప్రతిష్ఠపాలగును. అయిక్యరాజ్యసమితి నిబంధనావళిని యెవరికి అనుకూలించినట్లుగా వారు అన్వయించుకొనుచున్నారు.

### పాకిస్థాన్ సైనిక సన్నాహాలు

(1-వ పేజీ తరువాయి)

ర్నర్ జనరల్ నజీముద్దీన్ నేడు విజ్ఞప్తి చేసెను.

పెషావర్ పౌరసన్మాన పత్రమునకు సమాధాన మొసంగుతూ, "పాకిస్థాన్ రక్షణలను దుర్భేద్యంచేయుటే తక్షణ ప్రధాన సమస్య" అని గవర్నర్ జనరల్ అనెను.

ఆహార పరిస్థితివిషయం మాట్లాడుతూ, వచ్చే ఆరు నెలలలో, పాకిస్థాన్ లోని యే రాష్ట్రంలోనూడా ఆహారకొరత ఉండదని హామీ యివ్వగలనని నజీముద్దీన్ తెలిపెను.

### తూర్పు పశ్చిమ బెంగాల్ సరిహద్దు సంఘటన

కలకత్తా, నవంబర్ 20: పశ్చిమ బెంగాల్ తూర్పు సరిహద్దుల వద్ద గస్తీ తిరుగుతున్న ముగ్గురు పశ్చిమ బెంగాల్ సైనికులు ఎవరిచేతనో అపహరించబడిరని నేటి వార్తలవలన తెలుస్తున్నది. ఈ సంఘటన మాల్దా - రాజషాహి సరిహద్దులదగ్గర నిన్న జరిగినట్లు తెలుస్తున్నది. ఎవరో కొందరు దుండగీళ్లు ఇండియన్ యూనియన్ ప్రాంత భూములనుండి ధాన్యం అపహరిస్తుండగా ఈ సైనికులు అడ్డుపడగా దుండగీళ్లు వారిని అపహరించుకుని పోయిరి.

### సర్వసేనాధిపతి ఉద్బోధ

రావల్పిండి, నవంబరు 21: పాకిస్థాన్ కు ప్రమాద పరిస్థితులు వచ్చిన పక్షంలో ఉపయోగపడేందుకు, దృఢమైన పౌరరక్షణ దళములు, విమానదాడి రక్షక (ఎ.ఆర్.పి.) దళములు నిర్మించుట అత్యావశ్యకమనీ, ఇవి యుద్ధంచేసే సేనలకు వెన్నెముకవంటివనీ పాకిస్థాన్ సర్వసేనాధిపతి జనరల్ సర్ డగ్లస్ గ్రేసీ నిన్న ఒక సావస్వత

## పార్టీ విధానాన్ని ఖండించి స్థానల్గురు ఆంధ్ర కమ్యూనిస్టుల ప్రకటన

### డా॥ అచ్చమాంబ, గోపాల కృష్ణయ్యగార్లరాజీనామా

చెన్నపట్నం, నవంబరు 21: భారతదేశ కమ్యూనిస్టు పార్టీ ప్రస్తుత మనుసరించు చున్న విధానము ఖండించుచూ, పార్టీ కార్యకలాపములతో తమ సంబంధము తెంచుకొను చున్నట్లు నిర్బంధములో వున్న రాష్ట్ర కమ్యూనిస్టు ప్రముఖులు నల్గురు మద్రాసు ప్రభుత్వమునకు ఒక ప్రకటనద్వారా తెలియజేసిరి.

వీరు: (1) డా॥ అచ్చమాంబ (2) వెంకటరామశాస్త్రి, (3) వావిలాల గోపాలకృష్ణయ, (4) కంభంపాటి సత్యనారాయణ (జూనియర్.)

భవిష్య ద్విధానము ననుసరించుటలో పార్టీలువున్న తమ అనుచర వర్గమునకు తమ ఈ నిర్ణయము మార్గదర్శకము కాగలదని ఆశించుచున్నట్లు కూడ వీరు ప్రకటనలో తెలియజేసిరి.

### ఈజిప్ట్ షర్షియా రాజదంపతుల విడాకులు

కెయిరో, నవంబరు 20: ఈజిప్టురాజు ఫరూక్ నిన్న తనరాణి ఫరీదాకు విడాకులిచ్చెను. ఈమె వయస్సు 27 ఏండ్లు. వీరికి కలిగిన 3 గురు పుత్రికలలో మొదటి ఇద్దరినీ రాజుగారు, ఆఖరిపిల్లను మాజీరాణి పెంచుటకు ఒప్పందం జరిగినది.

తొలి వార్తలు

కైరో, నవంబరు 29: ఈజిప్ట్ రాజదంపతులు, పర్షియా రాజదంపతులు నేడు తమ తమ వివాహములను రద్దుచేసుకొని విడాకులిచ్చుకొనిరి. ఈజిప్టురాజు ఫరూక్ 28 యేండ్ల ప్రాయమువాడు, ఆయనభార్య ఫరీదారాణి 29 యేండ్ల వయస్కురాలు. పర్షియారాజు భార్య, ఫాజియా, ఈజిప్ట్ రాజు సోదరి. పర్షియారాజధాని నగరంలో ఉండుటవల్ల ఆరోగ్యం చెడిపోవునని డాక్టర్లు సలహాయిచ్చినందున, ఫాజియా, పర్షియారాజుతో తనవివాహ సంబంధమును త్రెంచుకొని ఈజిప్టులో ఉండుటకు నిశ్చయించుకొన్నట్లు అధికారికవార్త ప్రకటింపబడెను. ఈజిప్ట్ రాజదంపతుల వివాహసంబంధ విచ్ఛేదకారణం తెలియలేదు.

పమ్మేళనంలో మాట్లాడుతూ ఉద్ఘాటించెను.

పాకిస్థాన్ సేనలలోని ప్రస్తుత సైనికులను ఇప్పుడు తగ్గించివేయటం మంచిది కాదని, అవసరమైనప్పుడు వీరందరిని తిరిగి సమీకరించటం కష్టమనీ కూడ ఆయన అన్నాడు.

### కాశ్మీర్‌లో పాకిస్థాన్ సైనిక చర్యలు

(1-వ పేజీ తరువాయి)

భారత ప్రధాని శ్రీనగర్ కరుదెంచుట ఇదే ప్రథమం గనుక, జమ్మూ కాశ్మీర్ ప్రభుత్వం, పండిట్ నెహ్రూకు అధికార పూర్వకంగా స్వాగతమొసంగెను.

గవర్నరు జనరల్ డకోటా విమానం నుండి పండిట్జీ దిగుతుండగా, కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా పండిటు నెహ్రూను పుష్పమాలాలంకృతుణ్ణి చేసి అభినందించెను. సంతోషాతిశయంతో ఒకరినొకరు కౌగలించుకొనిరి. చలిగాలిలోనే, వేలాది కాశ్మీర్ ప్రజలు పండిటు నెహ్రూ దర్శనార్థం విమానాశ్రయంనుండి నగరంవరకూ రోడ్డువెంబడి బారులుతీర్చి, 'నెహ్రూ జిందాబాద్, కాశ్మీర్ కేసరి జిందాబాద్' అనే నినాదములతో, నాయకులను అభినందించిరి.

పండిటు జవహరిలాల్ నెహ్రూ కాశ్మీర్ యుద్ధరంగకు సంబంధించిన తాజాపరిస్థితిని సరించి, మేజర్ జనరల్ తిమ్మయ్య లెఫ్టినెంటు జనరల్ కరియప్ప, మేజర్ జనరల్ కుల్వంత సింగ్ గార్లతో సంప్రదించెను. పండిటు నెహ్రూ జన్మదినోత్సవమునకై ఢిల్లీ వెళ్లిన కాశ్మీర్ ఉపప్రధాని గులాం మహమ్మద్ బక్షీ గూడా నెహ్రూ వెంట కాశ్మీర్ తిరిగివచ్చెను.

### భారతసైనికులలో ప్రజల విశ్వాసం

నౌషేరా, నవంబరు 20: అత్యున్నతమైన పర్వతశ్రేణుల మధ్యగా విస్తరించు చున్న దబ్రాల్ లోయ రాజోరికి 7 మైళ్ల దూరంలో ఉన్నది. సారవంతమైన ఈ లోయను సెప్టెంబరు 23 వ తేదీన శత్రు నిర్ముక్తంచేసి భారతసేనలు ప్రవేశించు సరికి అక్కడ 30 గ్రామాలలోనూ 25 జీవులకంటె ఎక్కువ లేరు. కాని ఒక నెల గడచుసరికి అసలు జనాభా 12 వేలలోనూ 11,500 మంది తిరిగి తమ నెలవులకు వచ్చినారని కస్సారా చూచిన ఒక అ. ప్రె. విలేఖరి వ్రాయుచున్నాడు. భారతసేనలను గూర్చి శత్రువులు చెప్పిన అఘాతకథలను విని భయపడి వీరంతా పారిపోయిరనీ, కాని క్రమంగా భారత సేనల నిజాయితీ, పెద్దమనిషి తరహా, తెలియగానే వారు తిరిగి వచ్చినారనీ కూడ అతడు తెల్పుచున్నాడు.

## డాక్టరు పట్టాభి 69 వ జన్మదినోత్సవం

### రంగాగారి విజ్ఞప్తి

నిడుబ్రోలు, నవంబరు 21: ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ ఎన్. జి. రంగాగారు, ఈనెల 24-వ ఆంధ్రప్రజ డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారి జన్మదినోత్సవము జరుపవలసినదిగ విజ్ఞప్తిచేయుచు ఇట్లు ప్రకటించుచున్నారు: డాక్టర్ పట్టాభి గారు కాంగ్రెసుకు, సంస్థానప్రజలకు ఘనమైన సేవ చేసిరి. గాంధీప్రవచనములను ప్రజలకు ప్రబోధించిరి. భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సిద్ధాంతమునకు బలము కూర్చిరి. నలుబది యేండ్లుగ దేశమునకు ఒక్కటేతిని అవిరామసేవ చేసి యువకులకు ఆదర్శప్రాయులైరి. రాష్ట్రపతిగ వీరు విజయవంతముగ వ్యవహరింతురని, కాంగ్రెసుకు, దేశమునకు చిరకాలము సేవచేయవలెనని ఆశించెదము.

### విజయవాడలో విపుల సన్నాహము

విజయవాడనుండి రాపర్ల వెంకటనరసింహారావుగారు ఇట్లు వ్రాయుచున్నారు:

పిటికస్వేయన్న బెబరు యూనియన్ వారు విజయవాడలో ఈ 24 న డాక్టరు పట్టాభిగారి 69 వ జన్మదినోత్సవము అంబారీతో అలంకరింపబడిన యష్టిబంటితో, మేళతాళములతో, కొన్ని వేలమంది కార్మికులతో పూరేగింపులు, హరికథలు, బుర్రకథలు, బీదలకు వస్త్రదానములతో అఖండ వైభవముగా జరుపుటకు నిశ్చయించినారు.

ఆరోజున బావాజీమఠం సందులో యూనియన్ ఆఫీసువద్ద కాంగ్రెసుజెండా ప్రతిష్ఠాపన జరుపబడును. పూజలుజరుగును, కొత్తపేట కార్మిక గ్రంథాలయము వద్దనుంచి పూరేగింపు ప్రారంభమై, అనంతరం బహిరంగసభ జరుగునని ప్రకటించుచున్నారు.

### చెన్నపురిలో ఏర్పాట్లు

మద్రాసు, నవంబరు 19: నవంబరు 24 వ తేదీ డా॥ పట్టాభిసీతారామయ్యగారి జన్మదినం గనుక ఆరోజున రాజాజీహాలులో మద్రాసు ప్రజలు, కాంగ్రెసు వర్కర్లు బహిరంగ ఏర్పాటుచేయదలచినారు. సమావేశకర్త డా॥ కె. వి. స్వామిగారు, సభా నిర్వహణ నిమిత్తం ఒక కమిటీ నేర్పరచుచు, ఉత్సాహవంతులైనవారు ఆకమిటీలో చేరదలిస్తే, వారి ఇంటికి రేపు 5 గంటలకు రావలసినదని విజ్ఞప్తిచేయుచున్నారు.

### డా॥ పట్టాభి కృతజ్ఞత

న్యూఢిల్లీ, నవంబరు 20: రాష్ట్రపతిగా ఎన్నుకోబడిన డా॥ పట్టాభిసీతారామయ్యగారు తమ క్షేమాభిలాషులు తమకు ఆసంఖ్యాకంగా పంపించిన అభినందన సందేశములకు తమ కృతజ్ఞత తెల్పుచున్నారు. సందేశములు వచ్చుట త్వరలో ఆగునేమో, ఒక్కొక్కరికి వేరువేరుగా తమ కృతజ్ఞత తెలుపవచ్చునని పట్టాభిగారు తలంచిరి. కాని వచ్చిన తంతులు వెయ్యినీ, ఉత్తరాలు 2 వేలను దాటిపోవుటచే పత్రికాముఖమునగాని కృతజ్ఞత ప్రకటించుటకు సాధ్యపడదనితలచి వారట్లు చేయుచు నేటిరాత్రి ఒక ప్రకటన చేసిరి.

### హైదరాబాదు పరిపాలన

న్యూఢిల్లీ, నవంబరు 20: హైదరాబాద్ మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌదరి ప్రధాన సివిల్ అధికారి బాక్లే ఈరోజు సంస్థాన శాఖ సలహాదారుడు వి. పి. మీనన్ తో దీర్ఘ సంభాషణలు జరిపిరి. సాయంత్రం సర్దార్ పటేల్ను కలుసుకొనిరి. హైదరాబాద్ పరిపాలనకు సంబంధించిన అనేక సమస్యలుచర్చింపబడినట్లును, అందు కాసింరజ్వీ విచారణ విషయంకూడా ఉన్నట్లును తెలుస్తున్నది. వీరు రేపు తిరిగి హైదరాబాద్ వెళ్లెదరు.

### వ్యవసాయ సంస్కరణల కమిటీ

మద్రాసు, నవంబరు 20: ఇండియాలోని ఆరురాష్ట్రాలలో పర్యటించి ప్రస్తుతం నవంబరు 22 నుండి 10 రోజులవరకు మద్రాసు రాష్ట్రంలో పర్యటించబోవుచున్న కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల కమిటీకి 80 మంది పైగా ప్రముఖులు తమ తమ సాక్ష్యములను నివేదించెదరు.

ఈ కమిటీలో జె. సి. కుమారప్ప (అధ్యక్షుడు) ప్రధాని రామస్వామి రెడ్డియార్, ఆచార్యరంగా, దంత్వాలా (బొంబై) అమీరరాజా, టి. వి. రాఘవులు, కె. మిత్ర సభ్యులు. మద్రాసు నగరంలో సాక్ష్యము తీసుకున్న పిదప, కాలికట్, బెజవాడలకు కమిటీ వెళ్లును.

కృష్ణానది నీటిమట్టం

విజయవాడ, నవంబరు 20: కృష్ణానది నీటిమట్టం నేడు ఆనకట్టపై 7.20 అడుగు లున్నది.

# కాశ్మీరులో మద్రాసు సేనల పరాక్రమము

## శ్రీ గోపాలరెడ్డి ప్రశంస

చెన్నపట్నం, నవంబరు 20: "కాశ్మీరు యుద్ధచరిత్రను వ్రాయవలసి వచ్చినప్పుడు చరిత్రకారులు అపూర్వఘట్టముగా వ్రాయగలరు. అనేక వేల అడుగులఎత్తున హిమావృత పర్వతశ్రేణులపై, జరుగుచున్న ఈ యుద్ధము అపూర్వమైనది. ఇందు భారతసేనలు, మద్రాసుసేనలు ప్రదర్శించుచున్న శౌర్య ధైర్య సాహసములు అప్రతిమానములు" అని మద్రాసు ప్రభుత్వ ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు కాశ్మీరు యుద్ధరంగము చూచివచ్చి మద్రాసునకు వచ్చిన మీదట ఆంధ్రపత్రిక ప్రతినిధితో మాట్లాడుచూ చెప్పిరి.

శ్రీ గోపాలరెడ్డిగారు ఇటుల చెప్పిరి: "దండయాత్ర వచ్చినవారిని బందిపోటు మూకలని చెప్పుట తప్పు. కాశ్మీరుపైకి వచ్చిన శత్రువులు యాదృచ్ఛికముగా వచ్చినవారు కానేరరు. సుశిక్షితులై సర్వసమాయత్తులైన పాకిస్థాన్ సేనలే యుద్ధరంగమున పోరుచున్నవి. అనంతమైన సేనలను, అర్థ అంగబలములను మనము ఈరంగమున గుప్పించినగాని ఇదమిద్ధమను విజయము అసాధ్యము. ఒకరోజున జోజిల్లా కనుమకు మరొకరోజున ఊరీరంగమునకు వెళ్ళి మనసేనల పరాక్రమమును, ప్రతిభను చూచితిమి. ఒకనాడు బ్రిగేడియర్ కరియప్పగారి వెంటను, మరొకనాడు అబ్దుల్లాగారితోను వెళ్ళితిమి. 15 వేల అడుగులఎత్తున మన గస్తీసైనికుల చూచితిమి. మన శత్రువులుగూడా అంతఎత్తునా, అప్రమత్తులై గస్తీసేనలతో ఉన్నారు. జోజిల్లా కనుమను మన సేనలు ఆక్రమించుట నవంబరు 1 వ తేదీనే జరిగినది. అయితే సైనిక వ్యూహ రక్షణకుగాను ఇంతవరకు ఆ వార్తను మనవారు ఆపియుంచిరి. మొదట శ్రీనగరులో మన సైనికులకు ధైర్యవచనములు హితవచనములు చెప్పితిని. వారు చాలా ధైర్యముగా ఉన్నారు. అందు తమిళ, కేరళ, ఆంధ్రదేశీయులు ఉన్నందున, తెనుగులోనే నేను మాట్లాడగా వారు అర్థము చేసుకున్నారు. నిత్యము హిమవర్షము కురియు శీతలదేశమునందు మన సైనికులు అరమరికలేక స్వదేశముగా ఎంచుకొని సుఖముగా ఉంటున్నందుకు అచ్చటివారుగూడా ఆశ్చర్యపడినారు. జోజిల్లాకనుమకు అర్థచంద్రాకృతిగా ఒక రోడ్డు తంగరాజు అను మన ఇంజనీరు వేసి ఒక 'ఇంజనీరింగుఫీట్'ను చేసెను. దానిని తంగరాజ్ రోడ్డు అనే పిలుచుచున్నాను. దానిని వారెంతయూ కొనియాడిరి. మా మాటకన్న ఒక పక్షము ముందుగానే మంచుపడుట ప్రారంభించినది. మన సేనలకు సప్లయిలు 3, 4 వందలమైళ్ళనుంచి రావలసి ఉండగా శత్రువులకు 30, 40 మైళ్ళ నుంచే వచ్చుచున్నవి. జమ్మూలో అధిక భాగము శత్రుహస్తములందే ఉన్నది. శీతాకాలము రాకముందే మన రహదారుల ఛేదించవలెనని శత్రువుల వ్యూహము. గిల్గిట్, లడఖ్లోయ ప్రాంతములు తప్ప కాశ్మీరులో చాలా భాగము మనవశమై యుండగా ... హైదరాబాదులో శత్రువు స్థితి బరిమీద దొరికిన పామువంటిది. కాశ్మీరులో మటుకు శత్రుస్థావరము బలీయమైనది. 12 వేల అడుగుల యెత్తునను 18 వేల అడుగుల ఎత్తునను మన సైనికులు పోరుచున్నారు. ఇంతకన్న ఏ ఇతర ప్రాంతముల నైనను యుద్ధము సులభమే. కొంచెమీరచుమించు ఆకాశమంత ఎత్తున శత్రువుతో మనముతల పడవలసి ఉన్నదన్న అతిశయోక్తి కాదు. ఇంతఎత్తున మన సైనికులు ప్రదర్శించుచున్న పరాక్రమమును అచటి సైనికాధికారులును, పౌరప్రముఖులును వేనోళ్ల స్తుతించుచున్నారు. మనవారిలో చాలా మందితో నేను మాటలాడితిని. ఆహారమునుగూర్చిగాని, వసతులగూర్చిగాని వారి కెట్టి ఆక్షేపణ ఉన్నట్లు వారు చెప్పలేదు. ఒకచో ఒకాయన సిగరెట్లు కరువుగా ఉంటాయని చెప్పినాడు. విచారించగా అది ఇచ్చుటకు ఉత్తర్వు అయినదనియు,వచ్చుటలో ఆలస్యమైనదనియు చెప్పిరి. 48 గంటలలో శరవేగమున మనసేనలు జోజిలా కనుమను ఆక్రమించినవి. అనుర్నాడే మేము మచ్చువెళ్లితిమి. సూర్యోదయమునుండి మధ్యాహ్నంవరకు శత్రుస్థావరములపై మన సైనికులు గుండ్లవర్షం కురిపించుచుండిరి. సాయంత్రం శత్రువుల కనుకూల సమయము. మొదటి సంవత్సరం ఈ సంరంభమున 50 కోట్లు ఖర్చయినది. ఈ సాలు అంతకన్న హెచ్చు అవవచ్చును. భారత స్వాతంత్ర్య రక్షణ సమరమున భారత సేనలు ప్రదర్శించుచున్న వీర పరాక్రమములు, సాధించుచున్న విజయములు, సువర్ణాక్షరములతో లిఖింపబడగలవు.

## అ. భా. విద్యా విషయక సభ

న్యూఢిల్లీ, నవంబరు 19: అ. భా. విద్యా విషయక మహాసభ బెంగుళూరులో డిసెంబరు 29 నుండి 30 వతేదీవరకు జరుగును. (అ. ప్రె.)

# "నన్ను విచారించేందుకు ఈ కోర్టుకు అధికారం లేదు"

## డాక్టర్ పరాశర్ వాఙ్మూలం

సావర్కార్ క్రాసుపరీక్ష వివరాలు

న్యూఢిల్లీ, నవంబర్ 20: సవర్కార్ గారు, తన వాఙ్మూలమును కోర్టువారికి చదివి వినిపించిన తరువాత, న్యాయాధిపతివారినిట్లు క్రాసుపరీక్ష చేసిరి.

ప్రశ్న: అహమ్మద్ నగరములో మదన్లాల్ నిర్వహించిన చర్యల సంగతి మీరు విని, మదన్లాలును పిలిపించి, శెబాసని మెచ్చుకొని, వెన్నుచరచి ఉత్సాహపరచినట్లూ, కార్యక్రమమును ముందుకు కొనసాగించవలసినదని ప్రోత్సాహ మిచ్చినట్లు మదన్లాల్ డా॥ జె. సి. జెయిన్తో చెప్పినట్లూ ప్రాసిక్యూషన్ సాక్ష్యములో మీ మీద అభియోగము తేబడినది—దీనికి మీ సమాధాన మేమి.

జవా:- అది వట్టి అబద్ధము.

ప్రశ్న:- జనవరి 14 వ తేదీ సాయంత్రము 7-30 గంటలకు కుమారి శాంతా మోదక్ నాథూరాం గాడ్సేనూ, ఆప్టేనూ మీ యింటిముందు దిగవిడిచినదట – నిజమేనా?—

జవా:-ఆ విషయం నాకేమియూ, తెలియదు.

ప్రశ్న:- జనవరి 14 వ తేదీ రాత్రి షుమారు 9 గంటలకు నాథూరాం, ఆప్టేలు ఇరువురూ ప్రేలుడు ఆయుధములున్న ఆ సంచీతో మీఇంటికి వచ్చినట్లూ, తరువాత కొంతసేపటికి మీ యింటినుండి బయటికి వచ్చినట్లూ తెలుపబడుచున్నది. ఇది నిజమేనా?

జవా:-అబద్ధము——

ప్రశ్న:-మహాత్మాగాంధీనీ, పండిట్ నెహ్రూనూ, సుహ్రావర్దీనీ అంతమొందింప వలయునని వీరు నిర్ణయించినట్లూ, ఆ కార్యక్రమమును నిర్వహించుటకు నాథూరాం, ఆప్టేలను ఆదేశించినట్లూ, దీక్షిత మహారాజుగారి ఆవరణలో, నాథూరాం సముఖమునందే ఆప్టే బాడ్జేతో చెప్పినట్లు తెలుపబడుచున్నది— ఈ విషయమై మీ అభిప్రాయమేమి?

జవా:-అబద్ధము-అట్టి విషయము ఆప్టేకిగాని, నాథూరాంకుగాని నే నెన్నడూ ఆదేశించి యుండలేదు.

ప్రశ్న: జనవరి 17-వ తేదీన నాథూరాం, ఆప్టే, బాడ్జేపిల్ల ముగ్గురూ మీ యింటికి వచ్చిరట; బాడ్జే క్రింది డాబాలో వుంచి మొదటి యిద్దరూ మేడమీదికి వచ్చిరట, తరువాత కొలది నిమిషములలో తిరిగి క్రిందికి దిగి వచ్చిరట. వారితోపాటు మీరుకూడ దిగివచ్చిరట. అప్పుడు 'మీకు విజయము కలుగుగాక' అని ఉత్సాహపరచిరట—ఇది నిజమేనా.

జవా: అంతయూ అబద్ధము.

ప్రశ్న: మీ యింటినుండి బయటికి వచ్చి, ఆప్టే, అచ్చట టాక్సీలోనున్న వారితో మహాత్ముని నూరేండ్లూ నిండినవని మీరు జోస్యము చెప్పినట్లు వారితో చెప్పినట్లూ, యీ కార్యక్రమము విజయవంతముగా ముగియుననుటకు సందేహమేమియూ లేదని ఆప్టేవారలతో చెప్పినట్లూ సాక్ష్యమున్నది— దానికేమందురు.

జ: అట్టిమాట నే నెప్పుడునూ, ఎవ్వరితోనూ అనియుండలేదు. ఆప్టే యెవ్వరితో యేమి చెప్పినాడో నాకు తెలియదు.

ప్రశ్న: 1948 జనవరి 19 వ తేదీ రాత్రి గం. 9-20 లకు ఢిల్లీనుండి ఫోను నెం. 8024 లో నుండి డాన్లే అను వ్యక్తి బొంబాయిలో 'సవర్కార్ భవన్'లోని మీ ఫోన్ నంబర్ (60201) పిలిచి కాసార్ అనువారితో మాటాడినట్లు నిరూపణ ఉన్నవి, డాన్లే మీ కార్యదర్శి, కాసార్ మీ అంగరక్షకుడు. 60201 మీ ఫోను నెంబరు ఈ విషయములు.

జ: ఈ సంగతి నాకేమియూ తెలియదు. డాన్లే నా కార్యదర్శియను మాట సత్యమే, కాసార్ నా అంగరక్షకుడను మాటయూ సత్యమే- 60201 నా ఫోను నెంబరనుమాటయూ సత్యమే. ఆ టెలిఫోను పిలుపు నాకు సంబంధించినదికాదు. వ్యక్తిగతముగా వారేదియో ప్రసంగించుకొనియుందురు.

ప్రశ్న: జనవరి 31 వ తేదీన పోలీసువారు మీ యిల్లు సోదాచేసి చాల ఉత్తరములు స్వాధీనముచేసుకొనిరా

జ: అవును. ఆ ఉత్తరములపై బాడ్జే చేవ్రాలుగాని, నాథూరాం చేవ్రాలుగాని, నాథూరాం ఆప్టేల ఇరువురి చేవ్రాలుగాని, ఆప్టే ఒక్కరి చేవ్రాలుగాని, లేదా ఆప్టే తరఫున యితరులు చేసిన చేవ్రాళ్లుగాని యున్నవి.

ప్రశ్న: 1948 జనవరి 17 వ తేదీకి పూర్వమే, నాథూరాం, ఆప్టే, కార్కరే, మదన్లాల్, డాక్టర్ పరచూర్ పిరిలో మీకు బాగా పరిచయమున్నట్లు తెలుపబడినది. ఇది నిశ్చయమేనా?

జ: హిందూమహాసభ కార్యకర్తలుగా నాథూరాం, ఆప్టేలను నేను బాగా యెరుగుదును.

కార్కరే, పరచూర్, బాడ్జేల పేరులు వినియున్నానుగా పరిచయములేదు. నేను మదన్లాలును మాత్రము ఎరుగనే ఎరుగను. అతని పేరే నే నెప్పుడూ వినలేదు.

ప్రశ్న: మీరింకేమైన చెప్పెదరా?

జవా: లేదు

### డాక్టర్ పరచూర్ వాఙ్మూలం

వినాయక దామోదర్ సవర్కార్ గారి క్రాసుపరీక్ష పూర్తియైన తరువాత, కోర్టు వారు, గాంధీ హత్యాభియోగములోని చివరి ముద్దాయియైన డాక్టర్ దత్తాత్రేయ సదాశివ పరచూర్ నుండి వాఙ్మూలమును తీసుకొనిరి.

ఆ వాఙ్మూలములో పరచూర్, అసలు తనను విచారించుటకు ఈ న్యాయస్థానమునకు హక్కేలేదని తెల్పినాడు.

"నే నెన్నడునూ బ్రిటిష్ పౌరుడను కాదు, ఏ న్యాయశాసనముల ప్రకారము ఈ కోర్టు సృష్టింపబడినదో ఆ శాసనములు నాపై వర్తింపవు. నేను ఆదినుండియూ, గ్వాలియర్ సంస్థానవాసిని. గ్వాలియర్ సంస్థాన పౌరుడనైనట్లు ప్రాసిక్యూషన్ తరఫున యేవిధమైన ఋజువులు చూపబడలేదు. ఎప్పుడో 19 వ శతాబ్దములో మా తండ్రిగారు కొన్నాళ్లపాటు పూనాలో వున్నారు. నేను మాత్రము 1902 సంవత్సరములో గ్వాలియర్ లో జన్మించియున్నాను. నా పౌరసత్వమునకు, జాతీయతకు సంబంధించిన ఈ ప్రధాన విషయమును ప్రాసిక్యూషన్వారు త్రోసివేయవలయునని చూచుచున్నారు. నేను గ్వాలియర్ పౌరుడుగా వారికి లభించిన భోగట్టానంతయూ త్రొక్కివేసినారు."

పరచూర్ వాఙ్మూలములో ఇంకనూ ఇట్లున్నది:—

"1947 డిశంబర్ 10-1948 జనవరి 30, తేదీల మధ్యగాని, మరెప్పుడుగాని, ఏ వ్యక్తితోనూ కలసి, కుట్రచేసి గాని, కుట్రచేయుట కంగీకరించిగాని యుండలేదు. గాంధీ హత్యవంటి అక్రమ చర్యనూ, చేసిగాని చేయించిగాని యుండలేదు. ఆ చనిపోయిన వారి (మహాత్ముని) మరణము ఏ కుట్ర యొక్క పర్యవసానమూ కాదు.

"నేను నా నేరము నంగీకరించి నానని తెలుపుట న్యాయశాస్త్రము ప్రకారముగాని, వాస్తవముగాగాని తనను నేరస్థుడుగా నిరూపింపజాలదు. నేను ఆ అంగీకారపత్రము మనస్ఫూర్తిగా వ్రాసి చేవ్రాలు చేసినాననుట సత్యదూరమైనది. నేను జబ్బుగానుండి, శారీరకముగానూ, మానసికముగానూ చాల దుస్థితిలోనున్నప్పుడు పోలీసువారు నన్ను హింసించుటచే అట్టిది వ్రాసి యిచ్చినాను. ఆ కాయితము వ్రాసియిచ్చినచో నన్ను కేసునుండి తొలగింతుమని వాగ్దానముచేసినారు. అట్లు కానిచో నన్నూ నా సంసారమునూ నాశనము చేయుదుమని బెదరించినారు. ఏమియూ చేయజాలని దుస్థితిలో నే నట్లు వ్రాసియిచ్చినాను.

"జనవరి 28 తేదీ గాడ్సే, పరచూరు లిద్దరూ మా యింటికి వచ్చినారు. గ్వాలియర్ హిందూ మహాసభనుండి కొంతమంది వాలంటీరులు కావలెనని కోరుటకుగాను వారు వచ్చిరి. వారు వచ్చి నాతో ఈ హత్యకు సంబంధించిన కార్యక్రమమేదో నాతో చర్చించినటుట సత్యదూరమైనది. జనవరి 27, 28 తేదీలలో స్వయముగాగాని దండవతిద్వారాగాని ఏ ఆయుధమునూ ఇచ్చుటకు గాని, అమ్మకమునకు యిప్పించుటకు ప్రయత్నించినాననుట సర్వమూ అబద్ధమైయున్నది, 30 జనవరి తేదీ ఈ సందర్భమున ఉత్సవముచేసి పంచిపెట్టుటకు నాయింటికి మిఠాయిలు తెప్పించి నాననుట కట్టిది.

"నాపై ఆరోపింపబడిన ఈ హత్యాభియోగగాథా కథనమంతయూ ద్వేషబుద్ధితో, నా శత్రువులు కల్పించినపన్నాగము. స్వార్థపరులైన నా రాజకీయ ప్రత్యర్థుల కేవల దుష్ప్రచారము."

తాను పోలీసువారిముందు వాఙ్మూలము నిచ్చిన పరిస్థితులను వివరించుచూ పరచూర్ ఇట్లు తెలిపినాడు.

"ఫిబ్రవరి 2 వ తేదీన పోలీసు వారు నన్ను గ్వాలియర్ కోటలో ఒక గదిలో ఒంటరిగా బంధించిరి. భూగర్భ కారాగారములో పడవేసి హింసింతుమని అనేకవిధముల బెదరించిరి. పదిరోజులైన తరువాత ముగ్గురు భారతప్రభుత్వపు పోలీసులు నేను బంధింపబడియున్న గదిలోనికి వచ్చిరి. అనేకవిధముల ప్రశ్నింపజొచ్చిరి. బొంబాయి పోలీసు ఉద్యోగియొకరు, నా పిల్లలు, సంసారములోని వ్యక్తులందరూ, పోలీసువారి స్వాధీనములో నున్నారనీ, ఈ కాయితము వ్రాసియిచ్చి వారిని ఆ చిక్కులోనుండి తొలగించుకొనుమనీ, నాకు సలహాయిచ్చినారు. వారి దుస్థితి తొలగింప వలయునను ఉద్దేశముతో నేనా కాయితమును చేవ్రాలుచేసి యిచ్చినాను.

"ఫిబ్రవరి 18 వ తేదీ వాఙ్మూలము నా సమ్మతిపై జరిగినదికాదు. నా రాజకీయ శత్రువులూ, పోలీసువారూ తయారు చేసిన బూటకము. నా ఆత్మీయుల నంపదని హత్యచేయుదుమని బెదరించి నాచేత ఆ చేవ్రాలు చేయించిరి. అందు వ్రాయబడిన సర్వవిషయము వట్టి కల్పితగాధ.

"నేను నిర్దోషిని, నాపై ఆరోపింపబడిన నేరములన్నియూ అబద్ధములు; పైపెచ్చు నన్ను విచారించుటకు ఈ కోర్టుకు హక్కు లేదు".

పరచూర్ వాఙ్మూలమును తీసుకొని కోర్టువారు విచారణను రేపటికి వాయిదా వేసిరి.

## సవార్కర్ కన్నీళ్లు

న్యూఢిల్లీ,నవంబరు20: సావర్కారుగారు తమ వాఙ్మూలము చదువుటకు రెండున్నర గంటల సేపు పట్టినది. భారతదేశ రాజకీయ స్వాతంత్ర్య సాధనలో తాను ఒక యోగునివలె పోరాడితినని చెప్పినప్పుడు సవార్కర్ గారి కళ్ళవెంట నీళ్లుకారెను. వాటిని జేబురుమాలుతో తుడుచుకొనిరి. యాభై సంవత్సరములపాటు ఏ దేశభక్తునకు గీసిపోని ఘోరజైలో అనేకబాధలుపడి, అనేక త్యాగములు చేసితినని కూడ చెప్పిరి.

# అర్చకుల యీనాము భూములు

## ధర్మాదాయబోర్డు స్వాధీనం చేసుకొనుటగూర్చి తీర్పు

చెన్నపట్నం, నవంబరు 20: గుంటూరు జిల్లాలో 10 దేవాలయాల ధర్మకర్తలు ఆర్చకులవశంలోనుండే యీనాముభూములను 1948 సంవత్సరమున సవరించిన ధర్మాదాయాల చట్టము సెక్షను 78 క్రింద దేవాలయాలకు సంక్రమింప చేయవలెనని కోరుతూ గుంటూరు జిల్లాకోర్టులో నొక దరఖాస్తును దాఖలుచేసిరి. దావాభూములు దేవాలయాలకు చెందేవని ధర్మాదాయాల బోర్డు జారీచేసిన సర్టిఫికేటును ధర్మకర్తలు కోర్టులో దాఖలుచేసిరి. ధర్మకర్తల దరఖాస్తును అర్చకులు ఎదిరిస్తూ భూముల స్వంతదారుని పట్టా దస్తావేజులను పరిశీలించకుండా అట్టి సర్టిఫికేట్లను జారీచేయుటకు ధర్మాదాయం బోర్డుకు అధికారములేదని, సంక్షేపము పద్ధతిని యీ దరఖాస్తులను విచారణచేసి పరిష్కరించుటకు కోర్టుకు జూరిస్డిక్షను లేదని తెలిపిరి. దేవాలయమును లక్షణముగా సేవచేస్తున్నందుకుగాను ఆ భూములు సర్వీసు ఈనాములుగా అనాదినుండి వారు అనుభవించుచున్నట్లు కూడా తెలియజేసిరి.

క్రిందికోర్టు జడ్జి అర్చకుల వాదనలను త్రోసివేస్తూ బోర్డొసగిన సర్టిఫికేట్లు ఆధారముపై ట్రస్టీల దరఖాస్తులను అనుమతించిరి. ఆ తీర్పుమీద హైకోర్టులో రివిజను దాఖలుచేయబడెను. ఈ విషయము మొదట న్యా॥ పంచాపకేశశాస్త్రిగారి వద్ద విచారణకు వచ్చెను. దావా విషయము ధర్మాదాయాలచట్టము సెక్షను 78 క్రింద సర్టిఫికేటు సగడం బోర్డు అధికారమునకు సంబంధించేదిగావున అయ్యది న్యాయశాస్త్రరీత్యా ముఖ్య సమస్యయనునదే అభిప్రాయంతో ఆ విషయము ఫుల్బెంచి ఆలోచించవలెనని కోరిరి. అపైని న్యా॥ పంచాపకేశశాస్త్రి, న్యా॥ సత్యనారాయణరావుగార్లు పై దరఖాస్తు విషయంలో యీ విధముగా తీర్పునిచ్చిరి. ధర్మాదాయాల చట్టం సెక్షను 78 క్రింద సర్టిఫికేటు జారీచేయ వీలగునట్లు చట్టమును సవరించుటలో శాసనసభ ఉద్దేశ్యము అట్టి సవరణను దేవాలయాల భూములకు వర్తింపచేయవలెననే యుండునుగాని సర్వీస్ యీనాములకు కాజాలదు. అదియునుగాక చట్టముయొక్క సెక్షను 78 క్రింద సర్టిఫికేటు నమూనా నిర్ణయము కాక పూర్వముగాని, నిబంధనలు తయారుకాక పూర్వముగాని వైవిధమైన సర్టిఫికేట్లు జారీచేయుటకు బోర్డుకు అధికారము లేనందున యీ పద్ధతి ప్రకారం అర్చకుల యీనాములను ధర్మకర్తలు వశపరుచుకొనుట చెల్లదని తీర్పులో తెలుపబడెను. ట్రస్టీలు యీనాములను వశపరచుకొనవలెనంటే వాటిమీద హక్కులను రుజువుపరచుకొంటూ దావాలు వేసి తగాదా పరిష్కరించుకొనవలెననిరి.

# మేయరు ఎన్నిక

## అయిదుగురు అభ్యర్థులు పోటీచేయుదురు

చెన్నపట్నం, నవంబరు 20: మదరాసు కార్పొరేషనుకు యీ వత్సరము బ్రాహ్మణేతర మేయరును ఎన్నుకొనవలసియున్నది. ఇందునిమిత్తం బ్రాహ్మణేతర కౌన్సిలర్ల యిష్టాగోష్ఠిసభ మేయరు పదవికి అభ్యర్థిని నిర్ణయించుటకుగాను డా॥ యు. కృష్ణారావుగారు నిన్న సాయంత్రం రిప్పన్ భవనములో ఆయన గదియందు ఆచారము మేరకు సమావేశపరచిరి.

మొత్తం 47 మంది బ్రాహ్మణేతర కౌన్సిలర్లలో 41 మంది సభకు హాజరైరి. మేయరు పదవికి ఒకే అభ్యర్థిని సూచించుటకు వీరిలో ఏకాభిప్రాయం కుదురలేదు. ఈ క్రింది అయిదుగురు సభ్యులు శ్రీ గుంటూరు నరసింహారావు, శ్రీ యస్. రామస్వామి నాయుడు, డా॥ ఏ. కృష్ణస్వామి, డా॥ పి. మార్తాండంపిళ్లై, శ్రీ జి. రాజమన్నార్ చెట్టిగార్లు పోటీ చేయునట్లు అభిప్రాయం తెలిపినందున మేయరు ఎన్నికకై నవంబరు 23 వతేదీ మధ్యాహ్నం 2-45 గం. అందరు కౌన్సిలర్ల సభను సమావేశపరుచునట్లు మేయరు కృష్ణారావుగారు ప్రకటించిరి.

# 'వచ్చే జులైలోగా ఈనాములు రద్దుచేయాలి'

## రాష్ట్ర ఈనాం రైతుల మహాసభ తీర్మానములు

చికాకోల్,నవంబరు 16:(ఆంధ్రరాష్ట్ర) ఈనాంరైతుమహాసభ శ్రీ గోగినేనిలక్ష్మీనారాయణగారధ్యక్షతను 14 న టెక్కలిలో జరిగెను. శ్రీ కె. పున్నయ్యగారు జాతీయపతాక ప్రతిష్ఠించిరి. ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ కె. హరికృష్ణచౌదరిగారు ప్రతినిధులకు స్వాగతమిచ్చుచు రైతుల నెదుర్కొను వివిధ సమస్యల చర్చించి, ఈనాముల విషయమై ఇట్లనిరి:

ఈనాములను జమీందారీల రద్దుబిల్లులో నుండి మినహాయించడంవల్ల యినాంరైతు విపరీతమైన నష్టానికి కష్టానికి గురికావలసి వచ్చింది. 1936 వ సంవత్సరపు మద్రాసు ఎస్టేటు లేండు అద్దె సవరణ చట్టము ప్రకారము రైతుకు దఖలుపడిన సాగుహక్కులు బలవంతంగా యీనాడు యినాందార్లు ఉద్యోగస్థుల సహకారంతో తొలగించుచున్నారు. ఇట్టి కృత్యాలు అరికట్టుటకు ఆంధ్రరాష్ట్ర రైతు కాంగ్రెసుసంఘము సముచితమైన సూచనలు ప్రభుత్వానికి చేసింది. గాని ప్రభుత్వము ఆసూచనలు గమనించినట్లులేదు. ట్రిబ్యునలులో రైతు కాంగ్రెసు ప్రతినిధి నియమించబడి బహిరంగవిచారణ జరిపించిననాడే యినాం రైతుకు రక్షణకాగలదు. ప్రస్తుత భూశిస్తు విధానము భూస్వామ్యవిధానము లోపభూయిష్టమైనది. ఇది సంస్కరించుటకు మధ్యవర్తిత్వ నిర్మూలన తక్షణం జరగాలి.

శ్రీ ఆరికపూడి రామనాథం గారు ప్రారంభోపన్యాసం చేసిరి.

అధ్యక్షు డుపన్యసించుచు ఆదికాలం నుండి భూమిమీద హక్కుదున్నే రైతుదే యనే సిద్ధాంతం అంగీకరింపబడియున్నదని, అమటుపట్ల వివిధాభిప్రాయములు కలిగినవని, కాంగ్రెసు ఎన్నికప్రణాళికలో కూడ సుస్పష్టంగా రైతుశ్రేయమును చూతుమని తెల్పబడినదనియు, జమీందారీలు, యినాములు వెంటనే రద్దుకావలని, యీమధ్య దళారులకు స్వస్తి చెప్పాలనిరి. యే కొందరు వ్యక్తుల ఆగ్రహావేశాలనో ఎదుర్కొనలేక, అధికారంలోవుండి తామిచ్చిన బాసతప్పినవారి చర్యను నిరసించవలెనని, ఈనాందార్లుకూడా శిస్తు వసూలుచేయు యేజంట్లుమాత్రమే యనిరి. రైతుసంఘములు, జమీన్ రైతుసంఘాలు, ఇనాందారి రైతుసంఘాలు, జిరాయితీ రైతుసంఘాలు, స్వంతకమత రైతుసంఘాలు మెఖాసారైతుసంఘాలు, పట్టాలరైతులసంఘాలు, ఈ విధముగ ఆయా పరిస్థితుల్ని బట్టి స్థాపించుకోవాలనిరి.

పిమ్మట గొట్టు లచ్చన్నగారు తీర్మానములను ప్రవేశపెడుతూ కాంగ్రెస్ హైకమాండు సూచనలప్రకారం సగం పంపకమూ, ప్రసుత చట్టప్రకారం పరిష్కారమూ, జమీందారీల రద్దునుంచి తాత్కాలికంగా యినాములను విడదీయుటయూ యనేకప్రశ్నలలో చిక్కురదే కూత్తమని తోచి తాత్కాలికంగా యినాముల సమస్య వుంచివేయడమైనదనిరి. ఇందుకు సంజాయిషీ అడుగుటలో అర్థములేదనిరి.

తర్వాత కళా ప్రపూర్ణ త్రిపురాన ప్రసాదరావుగారి మరణమునకు సానుభూతి తెల్పుచును, భారత ప్రధానమంత్రి పండిత నెహ్రూ జన్మదినోత్సవ సందర్భమున వారికి పూర్ణాయురారోగ్యము కలుగచేయవలెనని భగవంతుని ప్రార్థించుచును 1940 జూలైలోగా ఈనాముల రద్దుశాసనం చేయ్యాలని, అధికారోత్పత్తికిగాను నీటివసతులు కలిగించాలని, గిట్టుబాటయగు రీతిని ధాన్యం ధరలు నిర్ణయించాలని, కంట్రోలులేకుండా స్వేచ్ఛా వ్యాపారం సాగ నివ్వాలని తీర్మానములు చేసిరి.

ఆంధ్రరాష్ట్ర ఈనాం రైతుసంఘానికి గోగినేని లక్ష్మీనారాయణగారు అధ్యక్షులుగను, లుకులాపు లక్ష్మణదాసు కార్యదర్శిగను, బోయిన అప్పలస్వామిశెట్టి, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, ఆరెకపూడి రామనాథం మొదలగువారు సభ్యులుగా ఎన్నుకొనబడిరి.

## టెక్కలి తాలూకా రైతు కూలీ మహాసభ

టెక్కలి తాలూకా రైతుకూలీ మహాసభ 14 వ తేదీని టెక్కలిలో కప్పగంతుల సుబ్బారావుగారి అధ్యక్షతను జరిగెను. పండిత నెహ్రూజన్మదినోత్సవముచే మొదట ఆయన కాశీర్వాదము చేయబడెను.

అధ్యక్షుడు ఉపన్యసించుచు జమీందార్లు, యినాందార్లు మాదిరిగానే యీ పెద్దపెద్ద పట్టాలున్న రైతులు అమాయకులైన రైతు-కూలీల రక్తాన్ని జలగలవలె చప్పుడు లేకుండా త్రాగివేస్తున్నారనిరి. కూలీలు, పంజాన్లు ఎండనక వాననక యీ పెద్ద పట్టా రైతుల పొలాల్లో పేసులుమాడి పనిచేస్తుంటే యీ పెద్ద రైతులు రైతు-కూలీ పండించిన పంటలను అధిక ధరలకు అమ్మి బాగా ధనం సంపాదించుకొంటు

న్నారేగాని రైతుకూలీకి సరిగా కూలి అయినా యివ్వడంలేదు. అందువల్ల వీరు న్నూ దళారులే. నిజంగా భూమిని దున్ని పండించేవాడు రైతు కూలీయే. అటువంటి రైతు-కూలీకి పొట్టానిండా తిండి కట్టు కొను గుడ్డ, నిలువనీడ కూర్పాలంటే యే రైతు-కూలీ ఏ పొలం దున్నుతే, ఆపొలం ఆ భూమిపైని సగం హక్కు వానికే యివ్వాలి. గింజల ధరలు పెరిగిన తర్వాత పెద్ద రైతులు ఈ రైతు కూలీలకు కూలి గింజలరూపంలో ఇవ్వ నెనుకాడుచున్నాడు. ఈ ధర అన్నంతవరకూ నగదు ఇచ్చేటప్పుడు దినానికి మగవానికి రు. 3-0-0 లు ఆడకూలీకి రు. 2-0-0 లు కనీసం కూలి యివ్వాలి అని వారనిరి. శివల సుబ్బారావు, రెయ్యి చంద్రయ్యగార్లు వివిధవిషయాలు గురించి ముఖ్యంగా యినాందార్లు, రైతు-కూలీల హక్కులు గురించి మాట్లాడిరి. పిమ్మట రెయి చంద్రయ్యకు "సర్దార్" బిరుదు ఇవ్వబడెను.

మగరైతు కూలీకి రు. 3/-లు ఆడ రైతు కూలీకి రు. 2/-లు రోజుకూలి యివ్వాలని, కూర్మయ్య మంత్రిగారు వ్యవసాయకూలీ చట్టము, హరిజన సమస్యల విషయమై చేస్తూన్న కృషికి అభినందిస్తూనూ, భూమి దున్ను రైతు-కూలీకే భూమి హక్కు ఉండాలని, రైతు-కూలీ ప్రజారాజ్యం నాడు గాని సాధ్యంకాదని తీర్మానించిరి.

# 'నిజామును పదవిభ్రష్టుని చేయాలి'

## భారత ప్రధానామాత్యునికి సోషలిస్టుల మహజరు

హైదరాబాద్, నవంబరు 19: నిజాం నవాబును పదవీభ్రష్టుని చేయవలెనని, రాజరికమును, జమీందారీ, జాగీర్దార్, పాయిగా, దేశముఖు విధానములను రద్దుచేయవలెనని, పరిశ్రమలను జాతీయము చేయించవలెనని, భారత ప్రధానామాత్యునికి హైదరాబాదు సోషలిస్టు పార్టీవారు మహజరు పెట్టుకొనబోవుచున్నారు. ఇప్పుడు వీరు ఈ మహజరుపై ప్రజలచే సంతకములు చేయించుకొనుచున్నారు. హాలీ నాణెముల చలామణీని, నిజాం కాయిరీ, తపాలా శాఖలను రద్దుచేయాలనీ, సంస్థానమును విడదీసి వేయవలెననికూడ వారందు కోరుచున్నారు. ఈ మహజరు లేఖరూపమున ఉన్నది. ఈ లేఖలో మొదటవారు, నిజాము ప్రజలను రజాకారుల ముప్పునుంచి, నిజాం నిరంకుశ పాలనమునుంచి రక్షించినందుకు ప్రధానామాత్యునికి, భారత ప్రభుత్వమునకు ధన్యవాదము లర్పించుచున్నారు. (స్వ. వి.)

## స్వామిజీ పర్యటన

సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుడు స్వామి రామానంద తీర్థ, కర్నాటక రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు జనార్దనరావు దేశాయి, సంస్థాన కాంగ్రెస్ కార్యదర్శి సభ్యుడు కృష్ణాచారి జోషిగార్లతో రాయచూరు జిల్లాలో పర్యటన నిమిత్తము వెళ్ళిరి. పర్యటన 6 రోజులు జరుగును. స్వామిజీ తిరిగి 25 న హైదరాబాద్ చేరుదురు. —(గు. ప్రె.)

## 600-మంది యు. పి. పోలీసులు

సంయుక్తరాష్ట్రములకు చెందిన ప్రత్యేక పోలీసులు 600-మంది లక్నోనుండి ప్రత్యేక రైలులో నేడు హైదరాబాదు చేరిరి. సంస్థానములో శాంతిభద్రతల రక్షణలో స్థానిక పోలీసులకు తోడ్పడుటకే ఈ పోలీసులు వచ్చినని చెప్పబడినది.

## ముస్లిం స్త్రీల విజ్ఞప్తి

పర్దానుండి తమకు విముక్తి కలిగించవలెనని, మగవారి క్రౌర్యమునుండి రక్షించి తమ పురోభివృద్ధికి తోడ్పడవలెనని మిలిటరీ గవర్నరుకు మొరపెట్టుకొనుచు 500 మంది ముస్లింస్త్రీలు ఒక మహజరు పెట్టుకొనిరి.

## ఉర్దూ పత్రికలపై నిషేధం

హైదరాబాద్ పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్, మతద్వేషప్రచారము చేస్తూచున్న 10 ఉర్దూపత్రికల ప్రకటనను నిషేధించుచు ఉత్తరువు చేసిరి. వాటి పేర్లు: హిందూస్థాన్, ఆస్ఫియాబాదిక్, నయాసంసార్, ఇక్దం, పయామ్, అస్తబ్, దక్కన్ న్యూస్ పేపర్, ఘబర్-హింద్, వతన్ న్యూస్, అనూక్, ఈ సంవత్సరం సెప్టెంబర్ 15 దరిమిలాను ప్రచురణ ప్రారంభమయిన పత్రికలన్నీ నిలిపివేయవలెనని, పత్రికలు నడుపదలచువారు మరల దరఖాస్తు చేసుకొనవలెనని మిలిటరీ ప్రభుత్వము ఉత్తరువు చేసెను.

# హైదరాబాదు సంస్థానములో ఎన్నికలు

## ఇండ్లకు నెంబర్లు వేయించవలెనని తాఖీదు

హైదరాబాదు, నవంబరు 20: హైదరాబాదులో జరుగనున్న ఎన్నికలకు ఉపక్రమణికగా వెంటనే యిండ్లకు నెంబర్లు వేయించవలసినదని వివిధ జిల్లాల సివిల్ పరిపాలకులకు ఎన్నికల కమిషనరు శ్రీ శేషాద్రిగారు ఉత్తరువులు జారీచేసి యున్నారు. కొన్ని జిల్లాలలో ఈ పని యిదివరకే ప్రారంభమైనది.

రాబోవు రాజ్యాంగ పరిషత్ ఎన్నికలలో వయసు వచ్చినవారందరు వోటు చేయవచ్చును. 1948 సాలు జనవరి 1 తేదీన 21 సంవత్సరముల ఈడు వచ్చిన పురుషుడు లేక స్త్రీ 'వయోజనుడు' అని నిర్వచింపబడును. నియోజక వర్గములకు హద్దు లేర్పరుచుటను గూర్చియు వోటర్ల పట్టికలను తయారు చేయుటను గూర్చి కూడ ఎన్నికల కమిషనరు శ్రద్ధగా నాలోచించుచున్నాడు. (అ. ప్రె.)

